# జమీన్ రైతు

Regd. No. H. NL. 18
సంపుటి: 56
సంచిక: 14

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు

5-4-85
శుక్రవారం
12 పేజీలు
75 పైసలు.

సంపాదకులు : నెల్లూరు శ్రీరామమూర్తి


# 'భారతదేశం' - ఎన్టీఆర్ పగటికలలు!

(మా హైదరాబాదు విలేఖరి)

ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు తలపెట్టిన భారతదేశం పార్టీ పట్ల తెలుగుదేశం పార్టీలో తీవ్రమైన వ్యతిరేకత వ్యక్తమవుతున్నట్లు తెలుస్తున్నది. రాష్ట్ర ప్రజల సంక్షేమానికి ప్రాధాన్యతనిచ్చి పాటుపడతానని ప్రజలను నమ్మించి అధికారంలోకి వచ్చిన రామారావు ఇటువంటి ప్రయత్నం చేయడం ఆత్మహత్యాసదృశ్యమని వారు హెచ్చరిస్తున్నారు. అయితే హితులు, సన్నిహితులు అన్నీ ఎవరెంత చెప్పినా ప్రధాని పదవిపై కన్ను వేసిన ముఖ్యమంత్రి రామారావు మాత్రం "భారతదేశం" పెట్టితీరతానని తంతెలు వేస్తున్నారు. 1983 లో అధికారంలోకి వచ్చినప్పుడు రామారావుకు ప్రధాన పదవిపైన కేవలం ఆశమాత్రమే ఉండేది, ఏదో ఓనాటికి ప్రధాని కాకపోతానా అని అనుకుంటుండేవారు. అయితే శ్రీమతి ఇందిరాగాంధీ మరణానంతరం, పార్లమెంటు శాసనసభ ఎన్నికల్లోగెలిపించి రాష్ట్రప్రజలు తిరుగులేని అధికారాన్నికట్టబెట్టడంతో ఆయనకు ప్రధానిపదవి కాంక్ష ఎక్కువైందని అంటున్నారు. తాము దైవాంశసంభూతులని ఈ దేశంలో ప్రధాని పదవి చేపట్టడానికి తగిన మించిన అర్హత గల వ్యక్తి మరొకరులేరని ఆయన భావిస్తున్నారని తెదే వర్గాలవారు అంటున్నారు.

అయితే కాంగ్రెస్(ఐ) వ్యతిరేకతతో

## హెగ్డే జాతీయ నాయకుడవుతాడని అసూయ?

ప్రజలు గెలిపించినంతమాత్రాన అది తెలుగుదేశం ఘనతకాదని, రాష్ట్రంలో ఒడిదొడుకులులేని రామారావు ప్రధాని పదవికి ప్రయత్నం చేయాలని ప్రయత్నించడం మంచిదికాదని, ఆ విధంగాచేస్తే ప్రజల విశ్వాసాన్ని వమ్ముచేసినట్లేనని ఈనాడు పత్రికాధిపతి రామోజీరావు హెచ్చరిస్తున్నారు. ఆయన ప్రతినిధిగా తెలుగుదేశం పార్టీలో రామారావు తర్వాత స్థానంలోఉంటూ అధికారం చెలాయిస్తున్న ఉపేంద్రద్వారాకూడా ఇదే మాటను రామోజీరావు చెప్పిస్తున్నారని కాని రామారావు చెవికి ఇవేమీ ఎక్కడంలేదని తెలుస్తున్నది. ఆసెంబ్లీ యెన్నికల్లో గెలిచిన వెంటనే 'భారతదేశంపార్టీ'ని మే 28 తేదిన పెడతానని రామారావు ప్రకటించారు. అయితే ఉపేంద్రమాత్రం పార్టీ ఏర్పాటు 'మే'లో సాధ్యంకాదని ప్రకటించారు. కాని అందరిని ఆశ్చర్యపరుస్తూ రామారావు మే 28 న పెడతానని ఇటీవల ఢిల్లీలో మళ్లీ ప్రకటించడం రాజకీయ పరిశీలకులను ఆశ్చర్యపరచింది. ఉపేంద్ర ప్రకటనతో ఏర్పడిన గందరగోళాన్ని రామారావు తన ఢిల్లీ ప్రకటనతో మరింత ఎక్కువచేశారు. [illegible] భారతదేశంపార్టీ ఏర్పాటు విషయంలో ఉపేంద్ర చేసిన ప్రకటన రామారావుతో ముందుగా సంప్రదించి చేసిందికాదని భావిస్తున్నారు.

ఏదిఏమైనా భారతదేశంపార్టీ ఏర్పాటును రాష్ట్రంలో రామారావుతప్ప ఇంతవరకు సమర్థించినవారెవరూ లేరు. ఈపార్టీ ఏర్పాటువల్లరామారావుకు లాభాలకంటే నష్టాలేఎక్కువని ఆయన సన్నిహితులు చెబుతున్నారు. స్పష్టమైన ఆలోచన లేనగా హడావిడిగా ముఖ్యమంత్రి పార్టీ ఏర్పాటుగురించి ప్రకటించడం అందరినీ విస్మయపరుస్తున్నది. ఇటీవల కర్ణాటకలో పార్లమెంటు ఎన్నికలలో ఓడి శాసనసభ ఎన్నికల్లోగెలిచి దేశవ్యాప్తంగా తనకంటే గొప్పపేరును రామకృష్ణ హెగ్డే సంపాదించుకోవడమే రామారావు త్వరగా పార్టీ పెట్టడానికి ముఖ్యకారణమని అంటున్నారు. ఒకవైపున హెగ్డేకు గొప్ప పేరుప్రతిష్ఠలు రావడం మరొకవైపు కర్ణాటక రాజకీయాల్లో ఎక్కువకాలం వుండకుండా త్వరలో జాతీయరాజకీయాల్లో ప్రవేశిస్తానని ఆయన ప్రకటించడంతో ప్రధానిపదవికి తనతో ఎక్కడ పోటీ వస్తాడోనని రామారావు తీవ్రంగా ఆందోళన చెందుతున్నట్లుగా రాజకీయ వర్గాలవారు భావిస్తున్నారు. ఎన్. టి. రామారావుతో పోలిస్తే ప్రధానిపదవిలోకి రావడానికి, ఆ పదవిని చేపట్టడానికి రామకృష్ణహెగ్డేకే ఎక్కువ అవకాశాలు వున్నాయనిరాజకీయపరిశీలకులఅంచనా. రామారావు జాతీయ రాజకీయాల్లోకి ఎగబాకితే ఆయనకు కాంగ్రెసేతర పార్టీల మద్దతు దొరకడం కష్టతరమే అవుతుంది, కాని రామకృష్ణహెగ్డే విషయం అలాకాదు. జాతీయరాజకీయాల్లోవున్నటువంటి ప్రతిపక్ష పార్టీల నాయకులతో చక్కని సంబంధాలు నెరపుతున్నారని, ఉత్తరాదిని ఆకట్టుకోగల హిందీభాషా వాక్చాతుర్యం ఆయనకే వుందని అనుభవజ్ఞులు అంటున్నారు.

రామారావు ఎంతగా ప్రయత్నించినప్పటికి ఫరూక్ అబ్దుల్లాను, ఆయా పార్టీల్లో అసంతృప్తులైన నాయకులను మాత్రమే ఆకర్షించుకునే అవకాశాలున్నాయని అంటున్నారు. పైపెచ్చు భారతదేశం పార్టీ స్థాపనతర్వాత ఆ పార్టీ ప్రచారానికి రామారావు రాష్ట్రంవిడిచి దేశంపైపడితే ఆయన పదవికి ఎసరు తప్పదని రాజకీయపరిశీలకులు భావిస్తున్నారు. ఈవిధమైనప్రయత్నాలు తెలుగుదేశం పార్టీలోనుంచే ప్రారంభమయ్యే అవకాశాలున్నాయని గత అనుభవం దృష్ట్యా ఈసారి అటువంటి ప్రయత్నాన్ని విపరీతాలకలిసిలో దిగ్విజయంగా నిర్వహిస్తారని వారు అంటున్నారు. —

## నెల్లూరు ముచ్చట్లు

### విమర్శకుడు

#### కావలి ఎన్నిక

పోటీలో ఉండేది కొమ్మిరెడ్డి మాత్రమే. ప్రధాన అభ్యర్థులు అద్దరే; కాంగ్రెస్-ఐ తరఫున మాగుంట సుబ్బరామిరెడ్డి, తెలుగుదేశం-ఎం.వి. నారాయణ.

తెలుగుదేశం అభ్యర్థి విషయంలో 8 తేదీ వరకు అనుమానంగానే వున్నది; నారాయణ గుండెనిబ్బరంగలవాడుగానే వున్నట్లున్నారు; పార్టీనాయకులు వరకు తలపూపినట్లేవున్నారు.

పోటీ తీవ్రంగానే వుండబోతుంది. కాంగ్రెస్ అభ్యర్థికి ఓటర్లమీద పరిపూర్ణమైన విశ్వాసముంది; కాని అది కాలక్రమంలో తగ్గిపోతుందేమో. హింస, భయోత్పాతం ఈ ప్రక్రియంతా దిగుమతవుతాయేమో అనేదే వారి సందేహం. అంతవరకు వస్తే అందరూ తెగించవలసుకోండి, అవకాశం కలుగకుండా ప్రశాంత వాతావరణంలో జరగడం వాంఛనీయం. భయపడేవారు జిల్లాయంత్రాంగం కావలి పోలీస్ వున్న అధికారులు బాధ్యులు కావాలి. అంతో బోలునో ఎందుకు మాట్లాడకూడదు?

#### మార్క్సిస్టుల పెడమార్గం

మాలకొండారెడ్డి దారుణ హత్య ఆ పార్టీవారిని ఎంతగా కలచివేస్తుంటుందో, రాడికల్స్ వల్ల వారిలో ఎలాంటి క్రోధాగ్ని రగుల్కొలిపి వుంటుందో ఎవరైనా అర్థం చేసుకోగలరు. కాని ఆ వుద్రేకంలో పెడమార్గం అవలంబించడాన్ని మాత్రం చట్టబద్ధులైన పౌరులు హర్షించలేరు.

నెల్లూరు మార్క్సిస్టులు రాడికల్స్ ఏరివేత కార్యక్రమాన్ని తామే చేపట్టారట; దామరమడుగు, శేరం గ్రామాలలో కాలేజి కొందరిని పట్టుకొని వారిమంచి విజాన్ని బయటకులాగి; వారిచేతనే ప్రణాళికను చెప్పించారట. ఆ రాడికల్స్ వారి కథ ప్రకారం జక్కా వెంకయ్యను హత్య చేయడానికి ముందు కుట్రపన్నారట; అది సాధ్యం కాలేదట. రెండవ లక్ష్యం మాలకొండారెడ్డి అట; అందులో తాము విజయులమైనట్లు వారు ఒప్పుకున్నారని మార్క్సిస్టులు చెప్తున్నారు.

వీరిచేత అవే మాటలు నెల్లూరు ట్రంకురోడ్డులో మాలకొండారెడ్డి ఇంటి వద్ద ప్రజల సమక్షంలో చెప్పించడానికి ప్రయత్నం చేశారు కాని; ఎందువల్లనో ఆ కార్యక్రమం విరిగిపోయినట్లుంది.

మాలకొండారెడ్డి హంతకులను పట్టివ్వడంలో, దర్యాప్తులో మార్క్సిస్టులు పోలీసులకు తమ సహాయ సహకారాలను పూర్తిగా అందివ్వవచ్చు. అంతేకాని స్వతంత్ర దర్యాప్తు ప్రజాకోర్టుల పద్ధతిలో ముద్దాయిలనేవారిచేత చెప్పించడం, చట్టాన్ని తామే హస్తగతం చేసుకోవడం ప్రమాదకరం. తమపార్టీ రెండు రాష్ట్రాల్లో అధికారంలో వున్నదని, తమ నాయకుడు జక్కా వెంకయ్య రాజ్యాంగబద్ధమైన శాసనసభ్యుడనే విషయాన్ని ఈ మిత్రులు మరచిపోకూడదు.

#### ఎక్కువధర కావాలి-కొనుగోలు కేంద్రాలు కాదు;

రైతులు మొలగొలుకులు ఎక్కువధరలకిగిలేషుడ్ కార్పొరేషన్ కొనుగోలు కేంద్రాలను ఎక్కువచేసింది. నెల్లూరు టవున్‌లో రెండు, కోవూరు-వేర్‌హౌస్ గోడౌన్లు, రాజుపాలెం, కాకుటూరు, ముద్దూరిపాడు (కావలి). అల్లూరు, ఇందుకూరుపేటలలో కొత్తగా కేంద్రాలు తెరిచారట. అయాప్రాంతాలవారు తమ ధాన్యాన్ని తమ రవాణావ్యయంతో ఆ కేంద్రాలకు తీసుకపోతే, తమ పరిమాణలను వర్తింపజేసి, కొలతలుపోను కొలవసొమ్ము రైతుచేతిలో పెడతారట. ఎఫ్. సి. ఐ. కేంద్రాలకు తీసుకపోవడమంటే తిరుకవరమే, మద్దతుధరకూడారాదు;

మనకు మొలగొలుకులు శ్రేష్ఠమైనరకం; ప్రభుత్వ దృష్టిలో అది సామాన్యరకం; అంటే 2008, ఎమర్జెన్సీలతో సమానం; వారికి ఐ.ఆర్.20 నాజూకు, ఐ.ఆర్.50 అతినాజూకురకాలు; మనకు తగ్గురకాలు. ఈ అన్యాయం పైరోంగాలి; రైతుకు తనధాన్యాన్ని బయట ధరవున్నచోట అమ్ముకునే అవకాశం కల్పించాలి, ప్రభుత్వ మద్దతుధరకంటే మార్కెట్‌ధర ప్రస్తుతం తక్కువగాదు; మొలగొలుకు మద్దతుధర రూ1180 అయితే మార్కెట్లో రూ 1220 పలుకుతోంది.

#### సంక్షిప్తంగా...

❖ జిల్లాపరిషత్తు బడ్జెట్ 10 కోట్ల 74 లక్షల 2 వేల ఆదాయం; ఖర్చులు పోను లోటు 35 లక్షల 250 రూ. సభ్యుల చర్చలేకుండా బడ్జెటును ఆమోదించారు. ఇతర అంశాలలో మాత్రం మంత్రులిద్దరిని సభలో కలెక్టరును నిలదీసి నిల్దారు, పాపం, అన్నిటికీ ఆమే!

❖ వెంకటాచలం సమితికి ఇన్‌చార్జి అధ్యక్షులే గతి అయింది; రామకృష్ణారెడ్డి ఎం. ఎల్. ఎ. కాగా, ఇన్‌చార్జి అధ్యక్షుడుగా వైసుపురం సర్‌పంచ్ శ్రీ కత్యం నియమింపబడినారు, రిజర్వుడు సీటు ఇంతకాలానికి హరిజనుడిచేతికివచ్చింది, సూళ్ళూరుపేట అధ్యక్షపదవి తండ్రిమండి తనయుని రామచంద్రారెడ్డిగారికొచ్చింది.

❖ వసవనగరిక విగరపంతేకమైన 'జెరెక్స్' సౌకర్యం నెల్లూరులో లభించింది. 1 తేది కలెక్టరు డైరెక్టరు శ్రీ మూర్తి 20 రైన్ల జెరెక్స్ ఎక్స్చేంజిని స్విచ్ఆన్ చేశారు, ప్రస్తుతానికి టెలిగ్రాఫ్ ఆఫీసులో ఒక పబ్లిక్ జెరెక్స్‌ను తెరిచారు.

❖ జేమ్సుగార్డెన్ - చారీ రైల్వే వద్ద ఏళ్లపిరి సుబ్రహ్మణ్యం (22) ఎదురిటి పదహారేళ్ళ యువతి వీరజతో ఏడవది 26 తేది లోపాల్ చేసుకున్నాడట. రైల్వే ఎస్. ఐ. శ్రీ ఆర్. జి. నాగరాజా వారిని భద్రంగా నెల్లూరుకు చేర్చి, 8 తేది కోర్టుద్వారా రిమాండుకు పంపారు.

ప్రేమ, ప్రేమ... వయసుతో సంబంధం లేకుండా ఈ పిచ్చి వెర్రితలలేస్తున్నది.

❖ వ్యాపార ప్రముఖులో దుర్మరణం పాలైన గాలి గోపాలరావు సంతాప సభ 27 తేది మునిసిపల్ హైస్కూల్ ప్రజమాని శ్రీ ఎ. మోహనరావు అధ్యక్షతన టక్షిణాపురంలో జరిగింది, శ్రీయుతులు ఎం. ఆర్. ప్రసాద్, పారా వెంకట సుబ్బయ్య, వి. కేశవయ్య, ఆర్. వి. నర్సింహాచారి, వెంకటనారాయణ ప్రభృతులు గోపాలరావు స్నేహశీలత్వాన్ని కొనియాడుతూ, అతని మరణం కోడిగుడ్ల వ్యాపార రంగానికి తీరని నష్టం అన్నారు.

❖ ఇంగ్లీషుమీడియం స్కూళ్ళలో మంచి పేరుపొందినవాటిలో ఒకటైన సెంట్రల్‌స్కూలు ద్వితీయ వార్షికోత్సవం 23 తేది సెంట్రల్ ద్యాంకు ఆవరణంలో ఎం. ఎల్. ఎ. శ్రీ కె. వి. సుబ్బారెడ్డి అధ్యక్షతన జరిగింది. కరస్పాండెంటు శ్రీ కె. ఎస్. రాజగోపాలరావు ప్రసంగించారు. విద్యార్థులు. 'ఉదయం' పాత్రికేయులు నారాయణరావు, ఎం. ఎల్. ఏ. గంగాధరం. డి. ఇ. ఓ. మస్తానారెడ్డి ప్రభృతులు ముఖ్యులందరినీ ఒకవేదికమీద చేర్చి స్కూలుకు వారి శుభాకాంక్షలు పొందారు.

#### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | పాతవి | 1400-00 |
| ,, | (క్రొత్తవి) | 1300-00 |
| మసూరి | | 1000-00 |
| ఐ. ఆర్. 20 | | 1225-00 |

---

## పబ్లిక్ నోటీసు

మా కక్షిదారు హైదరాబాదు కాపురస్తురాలు కురుగంటి రామమోహనరెడ్డి భార్య కురుగంటి వసంత యిచ్చిన సెంజాయిషీ మేరకు, ఈ నోటీసుద్వారా అందరికి తెలియజేయునదేమనగా—

మా కక్షిదారు 4-6-82 వి క్రయ అగ్రిమెంటు మేరకు రామదాసు కండ్రిగ గ్రామ సర్వే నెం. 2212, 2214, 2215 లలో 28-28 సెం. భూమిని పొట్టేపాళెంగ్రామ కాపురస్తురాలు బత్తుల ఆదిలక్ష్మమ్మ జనరల్ పవర్ ఆఫ్ అటార్ని తాలూకు డా॥ ఎల్. బాలకృష్ణా రెడ్డిగారి ద్వారా రూ. 30,000/- లకు కొనుగోలుచేసి కబాది సదరు భూమిని తనస్వాధీనములో వుంచుకొని అనుభవించుకొనుచున్నారు. ఇటీవల సదరు ఆ స్త్రీని బత్తుల ఆదిలక్ష్మమ్మ ఇతరులకు విక్రయించే వుద్దేశ్యముతో వున్నట్లు తెలియుచున్నది అట్టి విక్రయమును మా కక్షిదారుని బద్దకించవు. సదరు భూమి మా కక్షిదారుని స్వాధీనానుభవములో వుంటున్నది బత్తుల ఆదిలక్ష్మమ్మకు ఆ భూమిపై ఎటువంటి హక్కు లేదు. ఎవరైనా కొనుగోలు చేసినయెడల అందుకు వారే బాధ్యులగుదురని యిందుమూలంగా యావన్మందికి తెలియజేయడమైనది.

—ఎం. మల్లికార్జునరావు
అడ్వొకేటు


**జమీన్ రైతు చందా**

సంవత్సరం చందా రు. 40-00
అర్ధ సంవత్సరం రు. 20-00






## ●●● ఉత్తరక్రియలు

నా సహధర్మచారిణి

# కలవకూరు లక్ష్మమ్మ

23-3-1985 తేది శనివారంనాడు దైవసాన్నిధ్యం చెందినది.

ఆమె కర్మక్రతువులు

10-4-1985 తేది బుధవారం నెల్లూరు, పొగతోట (కె.వి.ఆర్. నగర్) లోని మా స్వగృహమున జరుగును. కావున తెలుపడమైనది.

కర్త.
కలవకూరు శేషారెడ్డి
(K. V. R. BROTHERS.)

Edited, Printed & Published by N. Sree Ramamurthy at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)